# శ్రీరామ దేవుని కథ



*మైథిలీవెంకటేశ్వరరావు*

వెల : రూ. 20/-


## సరస్వతి పబ్లికేషన్

**కాజావెంకటేశ్వరరావు స్ట్రీట్, అరండల్‌పేట**

**విజయవాడ - 2**



# శ్రీ బాలరక్షాస్తోత్రము

**శ్రీ మద్భాగవతము నుండి విరచితము**

బాలగ్రహరక్షా, దుస్స్వప్న దోష నివారణ కొరకు

అవ్యాదజోంఘ్రిమణిమాం స్తవ జాన్వథోరూ
యజ్ఞోచ్యుతః కటితటం జఠరం హయాస్యః
హృత్కేశవ స్త్వదుర ఈశ ఇనస్తు కంఠం
విష్ణుర్భుజం ముఖ మురుక్రమ ఈశ్వరః కమ్.

చక్ర్యగ్రత స్సహగదో హరి రస్తు పశ్చా
త్త్వత్పార్శ్వయో ర్ధనురసీ మధుహా జన శ్చ
కోణేషు శంఖ ఉరుగాయ ఉపర్యుపేంద్ర
స్తార్క్ష్యః క్షితౌ హలధరః పురుష స్సమంతాత్.

ఇంద్రియాణి హృషీకేశః ప్రాణా న్నారాయణోఽవతు
శ్వేతద్వీపపతి శ్చిత్తం మనో యోగీశ్వరోఽవతు.

పృశ్నిగర్భ శ్చ తే బుద్ధి మాత్మానం భగవాన్ హరిః
క్రీడంతం పాతు గోవింద శ్శయానం పాతు మాధవః.

వ్రజంత మవ్యాద్వైకుంఠ ఆసీనం త్వాం శ్రియః పతిః
భుంజానం యజ్ఞభు క్పాతు సర్వగ్రహభయంకరః.

డాకిన్యో యాతుధాన్య శ్చ కుష్మాండా యేఽర్భక గ్రహాః
భూత ప్రేత పిశాచా శ్చ యక్ష రక్షో వినాయకాః

కోటరా రేవతీ జ్యేష్ఠా పూతనా మాతృకాదయః
ఉన్మాదా యే హ్యపస్మారా దేహప్రాణేంద్రియ ద్రుహః

స్వప్న దృష్టా మహోత్పాతా వృద్ధ బాలగ్రహాశ్చయే
సర్వే నశ్యం తు తే విష్ణో ర్నామగ్రహణ భీరవః



# శ్రీవిష్ణు స్తోత్రం

శ్లో ॥

శాంతాకారం, భుజగశయనం, పద్మనాభం, సురేశం,।
విశ్వాకారం, గగనసదృశం, మేఘవర్ణం శుభాంగం॥
లక్ష్మీకాంతం, కమలనయనం, యోగిహృద్ధ్యానగమ్యం।
వందేవిష్ణుం, భవభయహరం, సర్వలోకైకనాథం ॥





## శ్రీరామ దేవుని కథ

### (శ్రీ లక్ష్మీ కటాక్షం మరియు వివాహ శుభకార్యాల కొరకు)

### నాగంభట్టు కాశీ క్షేత్రానికి బైలుదేరుట

పురాతన కాలంలో ఒకానొక గ్రామంలో నాగంభట్టు అను విప్రుడు నివసించుచుండేవాడు. ఆ విప్రునికి ఓ పుత్రుడు, పుత్రిక కలరు. పుత్రుని పేరు నారాయణ భట్టు, పుత్రిక పేరు నారాయణమ్మ. సంతానం యొక్క ఉన్నతమైన భవిష్యత్తు కొరకు కావాల్సిన ధనార్జన సంపాదించడం ఎలా అని ఆలోచనలో పడ్డాడు నాగంభట్టు. అతడికి కాశీకి వెళితే ధనం సంపాదించుకోవచ్చన్న ఆలోచన కలిగింది. ఆలోచన వచ్చినదే తడవు భార్యతోనూ, సంతానంతోనూ, చుట్టుపక్కల వారితోనూ చెప్పి కాశీ అన్నపూర్ణా క్షేత్రానికి బైలుదేరాడు.

బంధుమిత్రసపరివారంతో చెప్పి బయలుదేరిన అతను కొంతదూరం వరకు అలసట లేకుండా ప్రయాణించాడు. ఇంతలో నాగంభట్టుకి అకస్మాత్తుగా నారద, సూత, వ్యాసమహర్షులు సాక్షాత్కరించి "నాగంభట్టూ! అలసట తెలియకుండా ప్రయాణం చేస్తున్నావు? ఎక్కడవరకు?" అని పలకరించారు.

వారిని చూసి పరమానందం చెందిన నాగంభట్టు వారికి భక్తితో నమస్కరించి "సంతానాన్ని ఉన్నత స్థితిలో ఉంచటానికి ధనం అవసరం. ఆ ధనాన్ని సంపాదించటం కోసం నేను కాశీకి

వెళ్తున్నాను... అక్కడ ధనార్జన చేసి నా బాధ్యతలను నిర్వర్తించాలని భావిస్తూ కాశీకి బయలుదేరాను... నన్ను దీవించండి” అని చెప్పాడు.

దానికి ఆ మహర్షులు “నీ సంకల్పం మంచిదే. ఆనందించదగినదే. ధర్మబద్ధమైనదే. కాశీకి వెళ్ళిన నీకు గంగాస్నానం, కాశీ అన్నపూర్ణా విశ్వనాథుల దర్శనం దొరుకుతుంది. అత్యంత పుణ్యం నీకు కలుగుతుంది. అయితే నీవు చెయ్యవల్సినది ఇంకొకటి ఉంది. మేమొక కథను చెపుతాము వినుము” అని నారదుల వారు గాథను చెప్పడం ప్రారంభించారు.

“పూర్వం ‘కోసలము’ అనెడి పేరుతో ఒక రాజ్యము ఉండేది. దానిని దశరథ మహారాజుల వారు పరిపాలించేవారు. ఈ రాజుకి సకలైశ్వర్యాలు, సంపదలు అన్నీ ఉన్నా సంతానం లేదు. రాజగురువుల ఉపదేశంతో దశరథుడు పుత్రకామేష్ఠి యాగం సంకల్పించాడు. యాగాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేశాడు దశరథుడు. సంతృప్తి చెందిన అగ్నిదేవుడు ప్రత్యక్షమై ప్రసాదంగా పాయసాన్నము పాత్రని దశరథునికి ఇచ్చి భార్యలచే తినిపించమనీ, పుత్రసంతానం కలుగుతుందనీ చెప్పాడు.

అంతట దశరథుడు పాయసాన్ని కౌసల్యకి అందించాగా, ఆమె అందులో సగం కైకకి ఇచ్చింది. ఇరువురూ తిరిగి సుమిత్రకి పాయసాన్ని పంచారు. పాయసాన్ని భక్తితో స్వీకరించిన రాణులు యాగ ఫలితంగా గర్భవతులయ్యారు. దశరథుని ఆనందానికి అవధులు లేకుండా పోయింది. రాజ్యమంతా పండగ ప్రకటించాడు. నవమాసములు గడిచాయి. చైత్ర శుద్ధ నవమి, పునర్వసు నక్షత్రమున శ్రీరామ, లక్ష్మణ, భరత, శతృఘ్నులకు జన్మనిచ్చారు కౌసల్య, సుమిత్ర, కైకేయి.

పుత్రులు యందు ఎంతో మమకారంతో అల్లారు ముద్దుగా వారిని పెంచి పెద్దచేస్తున్నారు రాజదంపతులు. పిల్లలతో ముద్దు మరిపాలకు ఎల్లలే లేవు. దశరథునికి సమయం అనేది తెలియకుండా సంవత్సరాలు గడిచాయి. పిల్లలు యుక్తవయస్కులయ్యారు. ఒకనాడు విశ్వామిత్రుల వారు

దశరథుని వద్దకు వచ్చి తాను ఒక యాగాన్ని సంకల్పించాననీ, రాక్షసులు యాగభంగం కలిగిస్తున్నారు కావున యాగసంరక్షణార్థం రాముడిని తనతో పంపవలెనని కోరాడు.

ముని యొక్క కోరికను మన్నించి మనసులో ఎంతో బాధ ఉన్నా గురువుల చెప్పడం వల్ల రామలక్ష్మణులను విశ్వామిత్రునితో పంపాడు దశరథుడు. భక్తితో, గౌరవంతో విశ్వామిత్రుని వెంట కదిలారు రామలక్ష్మణులు. దారిలో వారికి బల, అతిబల విద్యలతో పాటు ఎన్నో విద్యలను నేర్పాడు. తాటకిని గురువు కోరికతో చంపాడు శ్రీరాముడు. విశ్వామిత్రుడు వారికి భగీరథుని గురించి చెప్పాడు. దారిలో అహల్యకి శ్రీరాముని వల్ల శాపవిమోచనం కలిగింది. ఆమె గురించి తెలిపి యాగప్రాంతానికి చేరి శ్రీరామలక్ష్మణుల రక్షణలో యాగాన్ని విశ్వామిత్రుడు సంతృప్తిగా ముగించాడు. తరువాత వారిని మిథిలా నగరానికి తీసుకుని వెళ్ళాడు. అక్కడ స్వయంవరంలో శివుని విల్లు విరిచి, జనకరాజ పుత్రి సీతను వివాహం చేసుకున్నాడు శ్రీరామచంద్రుడు.

దశరథుడు శ్రీరాముడిని యువరాజుగా పట్టాభిషేకం చేయ తలపెట్టాడు. కానీ తండ్రి అనగా దశరథ మహారాజు కైకకి ఇచ్చిన రెండు వరాలు కారణంగా సీతా లక్ష్మణ సమేతంగా శ్రీరాముడు పదునాలుగేండ్లు అరణ్యవాసానికి బయలుదేరారు. అడవిలో మాయలేడి సహాయంతో రావణాసురుడు సీతను అపహరింపగా వానరులతో మైత్రి చేశాడు. వాలిని సంహరించాడు. లంకానగరానికి వెళ్ళి రావణుని సంహరించాడు. విభీషణుడిని రాజుని చేశాడు. అగ్నిలో పవిత్రమైన సీతాదేవితో కలిసి అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషిక్తుడై రాజ్యాన్ని శ్రీరాముడు సోదరులతో కలసి సుఖంగా పాలించాడు... అత్యంత పుణ్యకరమైన ఈ 'శ్రీరాముని పూజించటం' అనేది ఒక వ్రతంగా భక్తులు నిర్వర్తిస్తారు..." అని నారదుల వారు వ్రతకథా విధానము తెలిపారు.

వ్రతాన్ని ఆచరించు భక్తులు ఐదు లక్ష్మీవారములు, ఐదు ఆదివారములు శ్రీరామునికి ఆవునేతితో దీపాన్ని పెట్టి భక్తితో

పూజించి గోధుమరవ్వను పాలు, బెల్లములతో కలిపి ఐదు ఉండలుగా చేసి వాటిని శ్రీరామదేవునకు నైవేద్యంగా సమర్పించవలెను. ఒక ఉండను శ్రీరామదేవునికి, ఒక ఉండను బ్రాహ్మణునికీ, ఒక ఉండను ముత్తైదువుకీ, ఒక ఉండను బంధుమిత్రులకీ మరియొక ఉండను భార్యాపిల్లలతో కలిసి స్వీకరించవలెను. ఈ విధంగా భక్తితో ఐదు లక్ష్మీవారములు పూజను చేసిన యెడల నీ సంకల్పం త్వరితంగా సిద్ధించును... ధనం సిద్ధించును" అని నారదుల వారు చెప్పారు.

నాగంభట్టు కాశీకి వెళ్ళకుండా తిరుగు ముఖం పట్టి గృహానికి చేరి నారదలు వారు చెప్పిన రామదేవుని వ్రతాన్ని భక్తితో అయిదు లక్ష్మివారములూ, అయిదు ఆదివారములూ ఆచరించాడు. అంతే కాక నిత్యం శ్రీరాముదేవుని కథ చదువుతూ, శ్రీరాముని స్మరించుతూ తన పని తాను నిర్వర్తించసాగాడు.

శ్రీరాముని అనుగ్రహంతో అతి తక్కువ దినములలోనే వ్రతఫలితంగా వ్యాపారంలో అనుకోనంత ధనాన్ని ఆర్జించి, అష్టైశ్వర్యములతో తులతూగాడు. కొంతకాలం తర్వాత 'తాను పూర్వము కాశీకి వెళ్ళాలని భావించి వెళ్ళలేదు కావున ఇప్పడయినా వెళ్ధామని నిర్ణయించుకుని కుమార్తె, కొడుకులతో నిత్యము శ్రీరామదేవుని కథని మానకుండా భక్తిశ్రద్ధలతో చదివి శ్రీరాముని పూజించమని చెప్పి కొంత ధనాన్ని తీసుకుని కాశీకి బయలుదేరాడు.

ఆ మరునటి రోజు నాగంభట్టు కుమారుడు స్నానమాచరించి శ్రీరాముని వద్ద దీపం పెట్టి తల్లిని శ్రీరాముని కథని వినటానికి రమ్మని పిలవగా ఆమె తనకి పని ఉన్నది ఇప్పడు వినటానికి కుదరదు అని సున్నితంగా తిరస్కరించింది. అతడు తిరిగి సాయంత్రం కథను వినమని కోరగా ఓపిక లేదు, నిద్రా సమయం కూడా అయిందని మళ్ళీ తిరస్కరించింది.

విరివిగా వచ్చిన సంపదలు చూస్తుండగానే తరలి

వెళ్ళిపోయాయి. పూర్వము వారిని అంటిపెట్టుకుని ఉన్న చిల్లురాగి చెంబు కూడా పోబోయే సరికి ఆమెకుమార్తె నారాయణమ్మ 'అమ్మా... ఆ రాగి చెంబునైనా ఉంచమని శ్రీరామదేవుని కోరుకో" అని చెప్పింది. అప్పటికే తెలివిలోకి వచ్చిన ఆమె కుమార్తె మాటలకు 'దానినైనా ఉంచు శ్రీరామా' అని ఆర్తితో కోరింది.

అంతే ఆ రాగిచెంబు తప్ప మిగిలినవన్నీ కనిపించకుండా పోయాయి. ఇంతలో ఒక గూటిలో ఉన్న వెండి కంచము కదలి వెడుతూ ఆమెకి కన్పించగా దాన్ని ఆపదలచి గట్టిగా పట్టుకున్నది. కానీ సగభాగం కంచము ఊడి పొరిగింటికి చేరినది. మరుసటి రోజున ఏదో పనిమీద అక్కడికి వెళ్ళిన నాగంభట్టు భార్యకి అక్కడ సగం వెండి కంచము కనిపించగా అది తమదేనని వారితో వాదించగా వారు 'ఏమ్మా.. మేమేమన్నా మీ ఇంటికి వచ్చామా.. మీరేమన్నా మా ఇంటికి వచ్చారా' అని దురుసుగా మాట్లాడింది. అంతట నాగంభట్టు భార్య తమ వద్ద ఉన్న సగం కంచము తీసుకువచ్చి దానితో కలపగా అది ఆశ్చర్యంగా అతుక్కుపోయింది.

ఇంతలో పొరిగింట వారు మొత్తం కంచం మాదే అని గట్టిగా వాదించి కంచాన్ని లాగివేసుకున్నారు. నాగంభట్టు భార్య బాధతో, అవమానంతో తలెత్తుకోలేక తిరిగి గృహానికి చేరుకున్నది. అప్పడే శ్రీరాముని పూజించి ఆమె కుమారుడు రామదేవుని కథను చదవబోతున్నాడు. తల్లిని చూసిన అతడు "తల్లీ...రామదేవుని కథను చెపుతాను ఇప్పడైనా భక్తిగా, శ్రద్ధగా వింటావా" అని అడిగాడు.

కానీ దుఃఖంతో ఉన్న ఆమె "నేనే కథను వినను.. వచ్చిన ఐశ్వర్యం వచ్చినట్టే నా గృహాన్ని దాటి వెళ్ళిపోయింది. అనేక అవమానాలను పొందుతున్నాను. నేను ఏదో ఒక పని చేసుకుని బ్రతుకుతాను... నీ చెల్లిని మాత్రం ఎవరికైనా మంచి వాడికిచ్చి వివాహం జరిపించు" అన్నది.

ఆమె చెప్పిన విధంగానే నారాయణ భట్టు చెల్లెలిని వెంట తీసుకుని బయలుదేరి వరుని అన్వేషించసాగాడు. అయితే కాశీ

నుంచి తిరిగి ప్రయాణమై వస్తున్న నాగంభట్టు ఊరి చివర ఉన్న కోనేటిలో దాహం తీర్చుకోవాలని భావించాడు. చేతిలో ఉన్న ధనం సంచీని ఒడ్డున పెట్టి దాహాన్ని తీర్చుకుంటుండగా ఒక పెద్ద గరుడపక్షి ఆ మూటను ఎత్తుకుని పోయింది. నాగంభట్టు విచారిస్తూ 'ఎంత పని జరిగింది' అని తలపోస్తూ ఊరు చేరుతున్నాడు. ఇంతలో అతనికి వరాన్వేషణలో ఊరు దాటుతున్న కుమార్తె, కుమారుడు కనిపించారు.

బిడ్డల్ని చూసిన ఆనందంతో వారిని పలకరించాడు నాగంభట్టు. 'ఊరు ఎందుకు దాటుతున్నారు' అని వారిని అడగగా కుమారుడు "నాన్నగారూ... మీరు చెప్పినట్టు గానే నేను శ్రీరాముదేవుని పూజించి కథను వినటానికి రమ్మని అమ్మని కోరగా ఆమె వినలేదు. ఆ కారణంగా శ్రీరామదేవునికి కోపం వచ్చింది. తత్ఫలితంగా  వచ్చిన ఐశ్వర్యం వచ్చినట్టే తరలి వెళ్లిపోయింది. రాగి చెంబు కూడా వెళ్ళుతుండగా శ్రీరామదేవుని దానినైనా ఉంచమని ప్రార్థించాము. ఆ చెంబు మాత్రమే మిగిలినది అంటూ కంచము వృత్తాంతమునంతా కూడా పూస గుచ్చిన విధంగా చెప్పాడు.

లేమిని చూసిన నా తల్లి అత్యంత బాధతో ఉన్నది. కనీసం నేడయినా శ్రీరామదేవుని కథని వినమంటే దుఃఖంతో తల్లి నా మాట వినలేదు. తాను ఏదో ఒక పని చేసుకుని ఉండెదననీ, చెల్లికి మంచి వరుడినిచ్చి వివాహం జరిపించమని అమ్మ ఆజ్ఞాపించింది. ఆమె ఆజ్ఞ ప్రకారంగా నేను ఇదిగో ఇలా చెల్లితో కలిసి ఊరు దాటుతున్నాను... మీరు కూడా అనుజ్ఞ ఇచ్చిన నేను నిర్వహించవలసిన కార్యాన్ని నిర్వహించెదను" అని గౌరవంగా పలికాడు.

నాగంభట్టు జరిగినదంతా విని విచారిస్తూ... "నాయనా! నీవు మీ అమ్మ చెప్పిన విధంగానే చేయి" అని వారిని ఆశీర్వదించి పంపాడు. నారయణభట్టు నారాయణమ్మను వెంట బెట్టుకుని ప్రయాణమయ్యాడు.

వారు కొంత దూరము వెళ్లే సరికి వారికి ఒక బ్రాహ్మణుడు ఎదురయ్యాడు.... నారయణభట్టు అతనికి నమస్కరించి... "బ్రాహ్మణోత్తమా.. నీవు నా చెల్లిని వివాహం చేసుకొనెదవా" అని అడిగాడు. అప్పడు ఆతడు నవ్వి "నాకు ఇదివరకే వివాహం జరిగిపోయింది. నాకు ఇద్దరు భార్యలు... ఇప్పడు మళ్లీ పెళ్లీ, పేరంటమూ నేను చేసుకోలేను" అని జవాబిచ్చాడు.

నారాయణభట్టు అతనికి నమస్కరించి సోదరితో కలిసి ముందుకు సాగాడు.... ఇంతలో వారికి ఒక పెద్ద పూల తోట కనిపించింది. ఆ తోటలో అన్నాచెల్లెళ్ళు అలసట తీర్చుకుని ఒక ప్రదేశంలో కూర్చుని శ్రీరామదేవుని కథని చెప్పకుంటూ ఉండగా ఎక్కడ నుండో ఒక బ్రాహ్మణ యువకుడు పూలకొరకై అక్కడికి వచ్చి పూలకోసుకోసాగాడు. రామదేవుని కథ పూర్తయిన పిదప తల ఎత్తి చూడగా నారాయణభట్టుకి ఎదురుగా ఆ యువకుడు కనిపించగా 'నా చెల్లిని వివాహం చేసుకుంటావా' అని అడిగాడు. అప్పడు ఆ యువకుడు 'వివాహం జరిపిస్తానంటే వద్దంటానా..... కానీ నా వివాహం నా గురువుగారి ఆజ్ఞ ప్రకారంగానే జరగాలి" అన్నాడు.

నారాయణ భట్టు 'మీ గురువుగారు ఎక్కడుంటారు?' అని అడగగా ఆయన ఉండే ప్రదేశం గూర్చి చెప్పాడు ఆ యువకుడు. వెనువెంటనే నారాయణ భట్టు ఆ ప్రదేశాన్ని చేరుకుని "గురువర్యా! నేను నా సోదరిని మీ శిష్యునకి ఇచ్చి వివాహం జరిపించదలిచాను. మీరు అంగీకరించిన అది నిర్వర్తించెదను" అని అడిగాడు. అంతట ఆ గురువు "బ్రహ్మచారిని గృహస్థునిగా చేస్తానంటే ఏ విధంగా కాదనగలను. కానీ నా శిష్యునికి గోవు పాదం మోపేంత స్థలం కూడా స్వంతంగా లేదు. మరి అటువంటి వానికి నీ చెల్లిని ఇచ్చి వివాహం జరిపించటం మీకు సమ్మతమైతే ఎటువంటి అడ్డులేకుండా జరిపించవచ్చు" అని అన్నాడు.

అపుడు నారాయణభట్టు గురువుకి భక్తితో నమస్కరించి

తన సమ్మతాన్ని తెలిపాడు. వెనువెంటనే వివాహానికి తగిన ఏర్పాట్లు చకచకా చేశాడు నారాయణ భట్టు. నాలుగు దుంగలు నాటి పందిరి వేసి, మామిడి తోరణాలు కట్టి బ్రాహ్మణ యువకునికి నారాయణమ్మ నిచ్చి వివాహం జరిపించాడు. అక్కడే వారితో పాటు ఉంటూ నిత్యం నారాయణభట్టు శ్రీరామదేవుని కథని చెప్పకుంటూ కాలం గడపసాగాడు.

ఒకనాడు నారాయణమ్మ, ఆమె భర్త, నారాయణభట్టు కూర్చుని శ్రీరామదేవుని కథను చదువుతుండగా ఒక బ్రాహ్మణుడు వారి వద్దకు వచ్చి “మీకు నాలుగు ఎకరముల భూమిని ఇస్తాము తీసుకొనెదరా” అని అడిగాడు. అప్పడు వారు “మేము రామదేవుని కథను చదువుకుంటున్నాము. కథ పూర్తి అయిన తరువాత స్వీకరించెదము.. మీకు ఇష్టమైన ఎడల మీరు కూడా కూర్చుని రామదేవుని కథని వినమ”ని కోరారు.

అది తన భాగ్యం అంటూ అతడు అక్కడ కూర్చుని కథ వినసాగాడు. కథ పూర్తి అయిన తర్వాత ఆ బ్రాహ్మణుడు రాగిచెంబుతో నీరుపోసి ఒక తోట ఉన్న స్థలము చెప్పి...“అక్కడ నాలుగు ఎకరముల ఆస్థి వున్నది... స్వీకరింపుమ”ని చెప్పి వెడలిపోయాడు. వారు అతడు ఇచ్చిన నాలుగు ఎకరాల భూమిని అనుభవించుచూ నిత్యం శ్రీరాముని పూజించి శ్రీరామదేవుని కథను చదువుతా అక్కడే కాలం గడపసాగారు. ఒకసారి ఆ ఊరి రాజుగారు ఒక రాజభవనాన్నీ, కొంత ధనాన్నీ పుణ్య దంపతులకు ధారపోయాలని చూస్తున్నారు. అయన ఎంత వెతికినా ఎవరూ సంపూర్ణమైన తృప్తిగా అనిపించలేదు. ఒకనాడు ఆ రాజుగారికి శ్రీరామదేవుడు కలలో కనిపించి, నారాయణమ్మ దంపతులు గురించి తెలిపాడు.

అంతే ఆ మరుసటి రోజున రాజుగారు పల్లకినీ వారి వద్దకు పంపాడు. రాజభటులు అక్కడికి వెళ్ళి “రాజు గారు పుణ్యదంపతులైన మీకు ఒక భవనాన్నీ, కొంత ధనాన్నీ ఇవ్వటానికి సంకల్పించారు. మిమ్మల్ని వెంటబెట్టుకుని తీసుకురమ్మని రాజు గారి ఆజ్ఞ” అని

చెప్పారు. శ్రీరామదేవుని కథని చదువుతున్న వారు “మేము రామదేవుని కథని చెప్పకుంటున్నాము... మీకు అంగీకారమైతే కూర్చుని కథని వినండి. ఆ తరువాత మేము మీతో వస్తాము” అనగా బోయీలు తాము కూడా కథను భక్తిశ్రద్ధలతో విని కథ పూర్తి అయిన తర్వాత వారికి పల్లకిలో తీసుకువెళ్ళి పుణ్యదంపతులను రాజుగారికి అప్పగించారు. రాజు సంతోషంతో వారికి తానివ్వదలచిన భవనాన్నీ, ధనాన్నీ వారికి ధారపోశాడు.

నారాయణమ్మ దంపతులు ఆ భవనంలో ఉంటూ నాలుగు ఎకరాల భూమిని సాగు చేసి పంట పండిస్తూ నిత్యమూ శ్రీరామదేవుని పూజిస్తూ, కథను చెప్పకుంటూ అక్కడే సుఖంగా జీవనం సాగించసాగారు. కొన్ని రోజులు ఈ విధంగా గడిచిపోయాయి. ఒకనాడు నారాయణ భట్టు చెల్లితో “నేను ఎన్ని రోజులని మీ వద్ద ఈ విధంగా ఉంటాను... నేను వెళ్ళి రామదేవుని తీసుకు వచ్చెదను” అని చెప్పి ప్రయాణమయ్యాడు.

కొంతదూరం ప్రయాణించిన నారాయణభట్టుకి ఒక గ్రామం కనిపించింది. ఆ గ్రామంలోంచి వెడుతుండగా అతడికి ఒక గొర్రెల కాపరి కనిపించాడు. అప్పడు నారాయణభట్టు అతడిని గ్రామంలోని విశేషాలను అడిగాడు. అప్పడు అతడు “నేను పుట్టడంతోనే అంధుడిగా పుట్టాను. వడ్లు ఎండబోసి నన్ను కాపలాగా కూర్చోమని చెప్పగా నేను కర్ర పుచ్చుకుని ఇక్కడ కాపలా కూర్చున్నాను... నా అవస్థ ఇది.... ఇక నేను గ్రామం లోని విశేషాలను ఏం చెప్తాను...” అని విరక్తిగా అన్నాడు. అంతట నారాయణ భట్టు “నేను ఒక కథను చెబుతాను వింటావా?” అని అడగగా అతడు అంగీకరించాడు.... అప్పడు నారాయణభట్టు శ్రీరామదేవుని కథ, వ్రత విధానాన్ని చెప్పసాగాడు. భక్తితో వింటున్న ఆ గొల్లవానికి వ్రతవిధానం కొంత చెప్పేసరికే కొంత కళ్ళు మసకగా కనిపించినవి. ‘అప్పడు ఆ గొల్లవాడు ఈ కథని, వ్రత విధానాన్ని వింటేనే ఇలా వుంది. అంతటి మహాత్మ్యం ఉన్న ఈ వ్రతాన్ని చేసుకుంటే ఇంకెంత మహాత్మ్యం వుంటుందో అని తలచి నారాయణభట్టుని తిరిగి

వివరంగా వ్రత విధానాన్ని చెప్పమని కోరాడు. అప్పుడు నారాయణభట్టు " రామదేవుని కథామహాత్మ్యం ఇంతని చెప్పలేము. ఐదు లక్ష్మీవారములు, ఐదు ఆదివారములు శ్రీరామదేవుని ముందు ఆవునేతితో దీపం పెట్టి, భక్తితో పూజించి గోధుమరవ్వని ఆవుపాలు, బెల్లములతో కలిపి ఐదు ఉండలుగా చేసి ప్రసాదాన్ని నివేదించి ఒక ఉండను శ్రీరామదేవునకు, ఒక ఉండను బ్రాహ్మణునికి దక్షిణతాంబూలములతో కలిపి, ఒక ఉండను ముత్తైదువునకు, ఒక ఉండను బంధుమిత్రులకి లేదా ఇరుగుపొరుగు వారికీ ఇచ్చి ఒక ఉండను భార్యాపిల్లలతో స్వీకరించవలెను" అని వివరంగా చెప్పి అక్కడ నుండి వెళ్లిపోయాడు.

నారాయణభట్టు తన ప్రయాణంలో ఒక ప్రదేశంలో ఒక రాజు విచారంతో కనిపించాడు. ఆ రాజును చూసి "ఏమి రాజా? విచారముతో వున్నావు?" అని అడగగా ఆ రాజు "నేను నా రాజ్యాన్ని పోగొట్టుకున్నాను. భార్యాబిడ్డలతో తలదాచుకోవటానికి పారిపోతుండగా నా భార్యాబిడ్డలు దారి తప్పిపోయి కనిపించకుండా పోయారు. నా అవస్థ ఏమని చెప్పను నాయనా!" అన్నాడు. "రాజా! నేను నీకొక దివ్యమైన కథను చెబుతాను. వింటావా?" అని అడగగా ఆ రాజు "నీవెవరవో నా దుఃఖాన్ని తీరే మార్గం చెప్పేవాడివిగా అగుపించుచున్నావు. తప్పకుండా ఆ కథను వింటాను.. చెప్పమని" కోరాడు. నారాయణభట్టు శ్రీరామదేవుని గాథను, పూజించే విధానాన్ని, వ్రతవిధానాన్ని వివరించాడు. గాథను వినటం పూర్తవుతుండగానే భార్యాబిడ్డలు రాజు వద్దకు అకస్మాత్తుగా వచ్చి చేరారు. భార్యతో కలిసి వ్రతవిధానాన్ని ఆచరించగానే రాజ్యం తిరిగి ప్రాప్తించింది. రాజు శ్రీరామదేవుని మహాత్మ్యమును భక్తితో తలపోస్తూ సుఖంగా జీవినం సాగించాడు.

ప్రయాణిస్తున్న నారాయణభట్టుకు ఒకచోట ఒక స్త్రీ విచారంతో దుఃఖిస్తూ కనిపించింది. ఆ స్త్రీ వద్దకు వెళ్ళి "తల్లీ

ఎందుకు నీవు ఇలా విచారిస్తున్నావు? నేను ఏమయినా నీకు సహాయపడెదనా?'' అని అడిగాడు. ''నాయనా! నాకు చిన్నతనంలోనే వివాహం జరిగింది. నా భర్త వివాహం అనంతరం కొన్ని రోజులకు ఎవరికీ చెప్పకుండా దేశటన చేస్తూ ఎక్కడికో వెళ్ళిపోయాడు. నా తల్లితండ్రులూ, అత్తమామలు కొంతకాలం నన్ను బాగానే చూసుకున్నారు. కానీ ఆ తర్వాత నిన్ను ఇంకెంత కాలం పోషిస్తాము... అంటూ ఇంట్లోంచి తరిమివేశారు.... ఎవరికీ కాని నేను నా బాధను ఎవరికి చెప్పకోవాలో తెలియక, ఎవరు తీరుస్తారో తెలియక చేసేది లేక ఇలా ఇక్కడ ఉన్నాను" అంటూ తన పరిస్థితిని వివరించింది.

అంతట నారాయణభట్టు 'నేను నీకు ఒక గాథను చెపుతాను వింటావా' అని అడిగాడు. "తప్పక వింటాను చెప్పమని" కోరింది. నారాయణభట్టు రామదేవుని కథ, పూజ, వ్రత విధానమంతా వివరంగా చెప్పేసరికి దేశాంతరం వెళ్ళిన ఆమె భర్త తిరిగి వస్తూ ఆమెకి కనిపించాడు. ఆమెని వెళ్ళగొట్టిన వారు ఆమెని వెత్తుక్కుంటూ వస్తూ కనిపించారు. ఆమె వారందరినీ చూసి పట్టరాని సంతోషంతో నారాయణభట్టుకి నమస్కరించి "మహానుభావా...! మీరు తెలిపిన రామదేవుని వ్రతాన్ని నేను ఐదు లక్ష్మివారములూ, ఐదు ఆదివారాలూ నిర్వర్తిస్తాను" అని చెప్పి అందరితో కలిసి గృహానికి బైలుదేరింది.

కొంతదూరం వెళ్ళిన నారాయణభట్టు పూజా సమయం అయిందని తలచి ఒక ఇంటి ముందు ఆగి ఆ ఇంటి ఇల్లాలితో "అమ్మా! పూజా సమయం అయింది. పూజ చేసుకునేందుకు నీ గృహంలో కొంతచోటు ఇస్తావా?" అని అడిగాడు. ఆమె "మా ఇంట మడీఆచారం కుదరవు. నేను ఇవ్వలేనని' ఖరాఖరండిగా చెప్పింది. అప్పడు నారాయణభట్టు "తల్లీ ఇక్కడ దగ్గరలో కోనేరు వంటిదేదైనా ఉన్నా చూపించమని'' అడుగగా ఆమె అట్లేని అక్కడ ఈశాన్యదిశలో ఉన్న కోనేరు గూర్చి చెప్పి దారి చూపించి వెళ్ళమని చెప్పింది.

నారాయణభట్టు కోనేరులో స్నానం చేసి మడి బట్ట ఆరేసుకుని ఇల్లు ఇవ్వనన్న ఇల్లాలి ఇంటి అరుగు మీదే కూర్చుని తూర్పుదిశగా ఈశాన్యమూలగా ఒక పీటకు పసుపు రాసి, బొట్టు పెట్టి రామదేవుని పటము ఉంచి ఆవునేతితో దీపం వెలిగించి ప్రసాదాన్ని నివేదించి శ్రీరామదేవుని కథను చదువుకొని ఆ ఇంటి ఇల్లాలికే తాంబూలము, దక్షిణ ప్రసాదములను ఇచ్చాడు. ఆ ఇల్లాలు వాటిని స్వీకరించి గృహంలోపలికి వెళ్ళిపోయింది. రామదేవుడు కథను చదువుకున్న అక్షింతలను కొన్ని తన మీద వేసుకుని కొన్ని ఆ ఇంటి మీద చల్లి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళిన కొద్దిసేపటికే ఆ ఇల్లు ఇంద్రభవనం అయిపోయింది.

ఆశ్చర్యపోయిన ఆమె భుక్తి కోసం వెళ్ళిన భర్త తిరిగి వస్తే తన ఇల్లును గుర్తుపట్టడని తలంచి బైట అరుగు మీదనే కూర్చుంది. కొంతసేపటికి వచ్చిన భర్త ఆ ఇంటిని చూసి ఆశ్చర్యపోయాడు. ఏ విధంగా ఇది జరిగిందని అడగగా ఆమె భర్తతో జరిగింది చెప్పి.... అతడు శ్రీరామదేవుని కథను చదువుకున్నప్పడు పట్టుకున్న అక్షింతలను తనపై కొంచెం వేసుకుని కొన్నింటినీ మన ఇంటి మీద వేసి వెళ్ళిపోయాడు.... అతను వెళ్ళిన నిమిషాలే మన ఇల్లు ఇంద్రభవనంలా మారిపోయింది.

అంతటి ఆమె భర్త 'పూజ చేసుకుంటానని అడిగితే స్థలాన్ని ఇవ్వని నీవూ ఒక స్త్రీ వేనా' అంటూ ఆమెపై ఆగ్రహించి అతడు వెళ్ళిన దిక్కుని చెప్పమని అడగగా నారయణభట్టు వెళ్ళిన దిక్కును ఆమె చూపించింది. ఆమె భర్త భట్టును వెతుక్కుంటూ ఆ దిక్కుగా బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళాక నారాయణభట్టు ఆ బ్రాహ్మణుడికి కనిపించాడు.

ఆ బ్రాహ్మణుడు నారాయణభుట్టుకి తన భార్య తరుపున క్షమాపణ చెప్పి "మహానుభావా! మీరు మా గృహానికి తప్పకుండా విచ్చేయాలని'' కోరాడు. ఆతడి కోరికను నిరాకరించిన నారాయణభట్టు "నేను శ్రీరామదేవుని వెతకటానికి వెళుతున్నాను...

" అన్నాడు. అప్పడు ఆ బ్రాహ్మణుడు మా తప్పని మన్నించి మీరు చేసుకున్న పూజా విధానము, ఏ దేవుని పూజించాలో చెప్పిన మేము కూడా ఆచరిస్తామని కోరాడు. అంతట నారాయణభట్టు శ్రీరామదేవుని పూజ విధానము, వ్రత విధానము, ప్రసాద తయారి, నివేదన గూర్చి చెప్పి ఐదు లక్ష్మివారములు, ఐదు ఆదివారములు పూజని చేసుకోమని చెప్పి తిరుగు ప్రయాణంలో తప్పక మీ ఇంటికి వస్తానని మాట ఇచ్చి వెళ్ళిపోయాడు.

తిరిగి వచ్చిన బ్రాహ్మణుడు భక్తితో నారాయణభట్టు చెప్పిన రామదేవుని వ్రతమును ఐదు లక్ష్మివారములు, ఐదు ఆదివారములు ఎటువంటి ఆటంకాలు లేకుండా ఆచరించాడు. వ్రతము పూర్తవుతుండగానే అతని అష్టైశ్వర్యములు ప్రాప్తించినాయి.

నారాయణభట్టు రామదేవుని కొరకు వెతుకుతూ ఎండ, వానలకు దడవక తిండి తిప్పలు గురించి పట్టించుకోకుండా రాత్రి, పగలు ప్రయాణాన్ని సాగించసాగాడు. కానీ మానవ శరీరం ఎంతని తట్టుకుంటుంది. కొంత కాలానికి నారాయణభట్టు మంచి ఎండలో ఒకనాడు కళ్ళు తిరిగి మూర్ఛిల్లి పడిపోయాడు. భక్తుడు ఆ విధంగా ఉంటే రామదేవుడు రాకుండా ఉంటాడా.... భక్తుడి ఆలన పాలన గూర్చి పట్టించుకోకుండా ఉంటాడా.... రామదేవుడు ముసలి బ్రాహ్మణ రూపంలో నారాయణ భట్టు వద్దకు వచ్చి నీళ్ళు చల్లి నారాయణభట్టుని లేపి మంచినీరు తాగించి 'భోజనము చేద్దువుగాని మా గృహానికి రమ్మ'ని పిలిచాడు. అప్పడు నారాయణభట్టు "నేను రామదేవుని వెతకటానికి వెళ్తున్నాను. భోజనం స్వీకరించను. తమరు నాపై దయతో దగ్గరిలోని కోనేరుని చూపిన స్నానమాచరించగలను" అని అడిగాడు. అప్పడు రామదేవుడు కోనేరును చూపించగా నారాయణభట్టు అక్కడ స్నానమాచరించి తిరిగి పైకి వచ్చేసమయానికి కోనేటి ఒడ్డున వెండిపీటలు, కంచాలు కనపించాయి. ఆశ్చర్యంతో చూస్తున్న నారాయణభట్టుకు రామదేవుడు, సీతమ్మలు ఎదురై తమ ఇంటికి భోజనానికి రమ్మని అడిగారు. కానీ నారాయణ భట్టు నేను

భోజనము మాత్రం చేయను... రామదేవుని కోసం వెతుకుతూ వెళుతున్నాను... అనగా ఆ రామదేవుని నేనే అన్నాడు అతడు. నారాయణభట్టు మహానుభావా...! నాకు మీ దర్శన భాగ్యం కావాలని కోరగా ధవళగంగాధరుడు రుద్రాక్ష, విభూతులను ధరించి నడుమున నాగాభరణములతో గంగా, పార్వతీ సమేతంగా ప్రత్యక్షమయ్యాడు.

ఆశ్చర్యంతో, పరమానందంతో నారాయణభట్టు ఈశ్వరుడిని మనస్ఫూర్తిగా స్తుతించాడు.

నారాయణభట్టు గద్గగ స్వరంతో 'ఈశ్వరా.... దయతో నాకు విష్ణు సాక్షాత్కారం ప్రసాదించమని' కోరగా లక్ష్మీసమేతుడైన శ్రీమహావిష్ణువు శంఖచక్రగదాధరుడై అతని ముందు సాక్షాత్కరించాడు. కన్నుల వెంట కన్నీరు కారుతుండగా గద్గద స్వరంతో నారాయణభట్టు శ్రీమన్నారాయణుడ్ని... శ్రీమహావిష్ణువుని స్తోత్రం చేశాడు. తరువాత 'స్వామీ.... నాపైకరుణతో మీరు నాకు సాక్షాత్కరించారు.... నాకు రామదేవుని చూసే అదృష్టాన్ని కూడా కలిగించండి" అంటూ భక్తితో, ప్రేమతో శ్రీరామ స్తుతిని చేస్తూ శ్రీరాముని ప్రార్థించాడు.

అంతే భక్తదయాళుడైన ఆ శ్రీరామచంద్రుడు సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్ను, హనుమంత పరివార సమేతంగా ప్రత్యక్షమయ్యాడు. ఆ రామదేవుడు మృదువుగా నారాయణభట్టుతో "నాయనా! నీవు ఇప్పటికైనా భోజనం చేస్తావా" అని అడిగాడు. అంతట నారయాణభట్టు 'స్వామీ! అట్లే చేస్తాను. కానీ భోజనానంతరం నాతో మీరు వస్తానని అభయం ఇస్తేనే నేను భోజనం చేస్తాను" అని కోరి ఆ స్వామి అభయాన్ని పొందాడు.

ఆ రామభక్తునికి సీతమ్మే స్వయంగా పంచభక్ష్య పరమాన్నములను, నవకాయవంటలను వండి వెండి పీట వేసి, భమిడి కంచం పెట్టి భోజనాన్ని వడ్డించింది. వానితో పాటు బంధుమిత్ర సపరివారమంతటికీ భోజనాన్ని వడ్డించింది

సీతమ్మతల్లి. భోజనం అనంతరం కర్పూర తాంబూలములు స్వీకరించిన తరువాత శ్రీరామదేవుని తన వెంట రావలసిందిగా నారాయణభట్టు కోరాడు. సమ్మతించిన శ్రీరామదేవుడు వెనుక వస్తుండగా ముందు నారాయణభట్టు బయలుదేరి వెళ్లసాగాడు. కొంత దూరం పోయిన తర్వాత నారాయణభట్టు వెనక్కి తిరిగి చూడగా రామదేవుడు కనిపించలేదు. దుఃఖంతో, బాధతో గుండె మెలిపెడుచుండగా నారాయణభట్టు కళ్ళు తిరిగి అక్కడికక్కడే మూర్ఛతో నేలమీద ఒరిగిపోయాడు. రామదేవుడు అతడిపై దయతో ముసలి బ్రాహ్మణ వేషంలో వచ్చి అతడిని లేపి మంచినీరిచ్చి క్షేమాన్ని అడగగా నారాయణభట్టు..."తండ్రీ! నీ మహిమను గూర్చి మహామహా యోగీశ్వరులే తెలుసుకొనలేకపోయారు.... నేను ఎంత... నా తప్పులు క్షమించి నాతో రావలసింది" అని రామదేవుని కోరగా రామదేవుడు అట్లే అని "నీవు వచ్చునపుడు ఎవరి గృహాలకు వెళ్ళినావో వారి ఇండ్లకు నీతో పాటు నన్ను కూడా నీ భుజాలపై ఎక్కించుకుని తీసుకెళ్ల''మనగా నారాయణభట్టు పరమానందంతో శ్రీరామదేవుని భుజాలపై ఎక్కించుకుని బయలుదేరాడు.

కొంతసేపటికి పూజ కోసం ఇల్లు ఇవ్వనన్న ఇల్లాలి ఇంటి వద్దకు చేరారు. అక్కడ ఆ ఇల్లాలూ, ఆమె భర్తా రామదేవుని పూజించి రామదేవుని కథను చెప్పకొనుచున్నారు. ఆ తరువాత తల్లిదండ్రులు, అత్తమామలచే ఇంటి నుండి వెళ్లగొట్టబడిన స్త్రీ గృహానికీ, రాజు గారింటికీ, గొల్లవాని ఇంటికి వెళ్ళారు. అందరూ కూడా శ్రీరామదేవుని కథ చెప్పకుంటూ కనిపించారు. రామదేవుడు వారికి తరగని ఐశ్వర్యాన్ని ప్రసాదించాడు. నారాయణభట్టు తరువాత తన చెల్లెలి ఇంటికి తీసుకువెళ్లగా అక్కడ ఆమె, ఆమెభర్త కూడా శ్రీరామదేవుని కథను చదువుతూ కనిపించారు. రామదేవుడు వారికి అష్టైశ్వర్యములను, దీర్ఘాయిష్షుని ప్రసాదించాడు. తన చెల్లితో నారాయణభట్టు "రామదేవుని తీసుకుని మన ఇంటికి పోవుచున్నాను. నీవు, నీ

భర్తా మన ఇంటికి రావలెను... మనమందరమూ శ్రీరామదేవుని వ్రతాన్ని చేసెదము" అని చెప్పాడు.

నారాయణమ్మ పరమానందంతో భర్తతో కలిసి అన్న వెంట బయలుదేరింది. వారంతా వారి ఊరి పొలిమేర వద్దకు చేరారు. గ్రామస్థులు వారిని చూశారు. కొంతమంది నాగంభట్టు వద్దకు వచ్చి "నాగంభట్టు గారూ! మీ గృహానికి మీ అమ్మాయి, అబ్బాయే కాక బంధువులు కూడా వస్తున్నారు" అని కేకేసి చెప్పారు. ఆ మాటలు వింటూనే నాగంభట్టు దంపతులు పరమానందంతో పరిగెత్తుకుంటూ బయటకు వచ్చి కుమారుని, కూతురుని దగ్గరకు తీసుకోబోతుండగా నారాయణభట్టు "అమ్మా! నన్ను తాకవద్దు. నేను శ్రీరామదేవునితో వచ్చాను. మీరు గృహాన్ని శుభ్రం చేసి ముగ్గులు పెట్టి, గుమ్మానికి పసుపు బొట్టు పెట్టి, తోరణాలు కట్టి, తూర్పు దిశ ఈశాన్య మూలగా పసుపు రాసిన పీటను ఉంచి, దానిపై రామదేవుని పటము పెట్టి ఆవునేతితో దీపం పెట్టి గోధుమనూక, ఆవుపాలు, బెల్లం కలిపిన ప్రసాదమును ఐదు ఉండలుగా చేసి, పూజకు అన్నింటినీ సిద్ధం చేసి కబురు చెప్తే నేను లోపలకు శ్రీరామదేవుని తీసుకుని వస్తాను" అని చెప్పాడు.

నాగంభట్టు దంపతులు ఎంతో సంతోషంతో కొడుకు చెప్పినవన్నీ చేసి కబురు చెప్పగా నారాయణభట్టు శ్రీరామదేవుని భుజముపై నుంచుకుని గ్రామములోని నాలుగు వీధులలో ఊరేగించి గృహానికి తీసుకుని వచ్చి క్రిందకి దించి "తండ్రీ! శ్రీరామా! మా ఇంటిలో తమరు మీ కుడిపాదాన్ని ఉంచి రావలసింది" అని ప్రార్థించాడు.

అప్పుడు రామదేవుడు భక్తుని కోరికపై వారి ఇంటిలో కుడిపాదాన్ని మోపేసరికి ఆ చిన్న ఇల్లు ఇంద్రభవనంగా మారిపోయింది. అప్పుడు నారాయణ భట్టు రామదేవునితో "నేను కటిక పేదవాడిని. నిన్నే ఎల్లప్పడూ పూజించెడి వాడిని. నాకు ఉన్నది ఈ పీటయే... దీనినే సింహాసనముని తలచి నా మీద దయతో దీనిపై ఆసీనులు కమ్మని" వినయంగా, భక్తిగా ప్రార్థించాడు.

భక్తసులభుడు, పరమదయాళుడైన ఆ ప్రభువు భక్తుని కోరికను కాదంటాడా... రామదేవుడు ఆ పీటపై కాలుమోపి కూర్చునేసరికే అది వజ్రాలూ, మణిమాణిక్యాలు, మరకతమణులతో చేసిన బంగారపు సింహాసనంగా మారిపోయింది. అంతలో రామదేవుని చెంత హనుమంత సమేతంగా సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నాదులు సాక్షాత్కరించారు. వారికీ ఆసనాలను చూపి నారాయణభట్టు కుటుంబ సమేతంగా రామదేవుని వ్రతముచేసుకుని, కథ చెప్పకుని, కథాక్షితలను తమ శిరస్సులపై ధరించారు.

ఇంతలో అక్కడికి ఒక పేద బ్రాహ్మణుడు వచ్చి "నాగంభట్టు గారూ! నా కుమార్తెను మీ కుమారునికిచ్చి వివాహం చేస్తాము.. అంగీకరిస్తారా?" అని అడగగా నాగంభట్టు "పిల్లని ఇస్తామంటే కాదంటామా...? వివాహం చేస్తానంటే వద్దంటామా?" అంటూ తమ అంగీకారం తెలిపి పందిర్లు వేయించి, మామిడి తోరణాలు, ముత్యాల తలంబ్రాలు పోయించి నారాయణభట్టుకి వివాహం జరిపించాడు.

నాగంభట్టు దంపతులు, నారాయణభట్టు దంపతులు, నారాయణమ్మ దంపతులు అంతా భక్తితో శ్రీరామదేవుని వ్రతము పట్టి తూర్పువైపు ఈశాన్యమున పుసుపు రాసిన పీటపై శ్రీరామదేవుని పటము పెట్టి, ఆవునేతితో దీపము, గోధుమరవ్వ, పాలు, బెల్లములతో కలిపిన ప్రసాదాన్ని ఐదు ఉండలుగా నివేదించి వ్రతాన్ని చేసుకుని కథని చదువుకుని కథాక్షితలు తలపై ధరించి వ్రత విధానాన్ని ఆచరించారు. ఈ విధంగా ఐదు లక్ష్మివారములు, ఐదు ఆదివారాములు నోమును నోచుకున్నారు. వారి భక్తికి రామదేవుడు మెచ్చి వారికి సకలైశ్వర్యములను, ఆయురారోగ్యములను ప్రసాదించాడు. వేలాది మంది భక్తులు శ్రీరామదేవుని నోమును చేపట్టి సకల సంపదలను, ఆరోగ్య ఐశ్వర్యములను పొంది సుఖంగా జీవించారు. శ్రీరామదేవుని

వ్రతము గూర్చి తెలిసిన వారు తెలియని వారికి వివరించిగా ఎందరో భక్తులు భక్తితో వ్రతమును ఆచరించి సుఖజీవనమున పొందారు. శుభకార్యాలకి పదుగురికీ అందించిన వారికి సకల శుభాలు.

- శ్రీరామదేవుని కథ సమాప్తము -

-ooo-



# శ్రీ సీతారామస్తోత్రమ్-
# శ్రీహనుమత్కృతమ్

**హనుమానువాచ :-**

అయోధ్యాపుర నేతారం మిథిలా పుర నాయకీం
రాఘవాణా మలంకారం వై దేహానా మలంక్రియాం.
రఘూణాం కులదీపం చ నిమీనాం కులదీపికాం
సూర్యవంశ సముద్భూతం సోమవంశసముద్భవాం.
పుత్రం దశరథస్యాపి పుత్రీం జనకభూపతేః
వసిష్ఠానుమతాచారం శతానందమతానుగాం.
కౌసల్యా గర్భ సంభూతం వేదిగర్భోదితాం స్వయం
పుండరీక విశాలాక్షం స్ఫుర దిందీవరేక్షణాం.
మత్తమాతంగ గమనం మత్తసారస గామినీం,
చందనార్ద్ర భుజామధ్యం కుంకుమాక్త భుజాంతరాం.
చాపాలంకృత హస్తాబ్జం పద్మాలంకృత పాణికాం
సర్వలోక విధాతారం సర్వలోక విధాయినీం.
లోకాభిరామం శ్రీరామ మభిరామాం చ మైథిలీం
దివ్య సింహాసనారూఢం దివ్య స్రగ్వస్త్ర భూషణాం.
అనుక్షణం కటాక్షాభ్యాం మన్యోన్యేక్షణకాంక్షిణౌ
అన్యోన్య సదృశా వేతౌ త్రైలోక్యగృహ దంపతీ.
ఇమౌ యువాం ప్రణమ్యాహం భజా మ్యతి కృతార్థతాం
అనయాస్తౌతి య స్స్తుత్యా రామం సీతాం చ భక్తితః.
తస్య తౌ తనుతాం ప్రీతౌ సంపద స్సకలా అపి
ఇతీదం రామచంద్రస్య జానక్యా శ్చ విశేషతః.
కృతం హనుమతా పుణ్యం స్తోత్రం సద్యో విముక్తిదం
యః పఠే త్ప్రాత రుత్థాయ సర్వాన్ కామా నవాప్నుయాత్.
య ఇదం పఠతి స్తోత్రం మైథిలీరామచంద్రయోః
శ్రీవైకుంఠ మవాప్నోతి స నరో హత కిల్బిషః.